*Issued — 4-3-1955*



# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## MONDAY, 1st NOVEMBER, 1954

## VOLUME X—No. 1

*CONTENTS*




PRINTED FOR ANDHRA GOVERNMENT PRESS

BY GORDON PRESS, GUNTUR-2.

1954

PRICE, 6 *annas*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

MONDAY, 1st November 1954

The House met in the Assembly Chamber, Kurnool, at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri N. Venkatramaiya) in the Chair

## I. SWEARING IN OF A MEMBER

Sri Meduri Nageswara Rao was sworn in.

## II. ANNOUNCEMENT RE: LEADER OF THE HOUSE

The Hon. Sri T. Prakasam —Mr. Speaker, before I answer this question, I am declaring that the Deputy Chief Minister Sri N. Sanjeeva Reddi shall be the Leader of this House under the Constitution throughout the proceedings that will be carried on by you. I make this declaration to enable you as the Speaker, and also the Leader of the Opposition and his other members, to take note of this and be under no mistake that I am continuing as Leader and that they could put questions to me or expect answers from me. Even with regard to this question, I am expecting Sri N. Sanjeeva Reddi to act for me and give the answers in this or in all connected matters so far as these proceedings are concerned.

## III. QUESTIONS AND ANSWERS

### STARRED QUESTIONS

#### APPLICATIONS TO THE PUBLIC SERVICE COMMISSION.

* 1. Q. Sri K. Krishna Rao: Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether it is a fact that applicants for Public Service are required to state in their applications to the Public Service Commission, the names of the students' organization with which they were connected in their student days, and to give a resume of their activities in their student days, and if so, why; and

[1st November 1954

(b) Whether the Government instructed the Public Service Commision to summarily reject applications from persons who in student days were members of any particular students' organization or organizations and if so, the names of such students organizations?

The Hon. Sri N. Sanjeeva Reddi.—

(a) and (b).—By students' organizations is apparently meant those organizations which are of a political character and whose activities are extra-curricular. If so, the answer is in the negative.

Candidates are however asked in the applications for appoinment to the State and Subordinate Services to specify the positions of authority held, if any, in (1) school (2) college (3) Boy Scout and (4) U. T C. (N. C. C.) against which they are expccted to say the positions held by them such as captain of a team, Secretary of a mess, Secretary of the literary association etc. This is with a view to estimate their all-round capacity and abilities.

Sri. K. Krishna Rao :—Students' organizations లో political activities ప్రధానంగా ఉండేటటువంటివి ఏవి? కేవలము political activities లేకుండా ఉండేటటువంటివి ఏవి ? అని Service Commission వాళ్లుగాని, గవర్నమెంటుగాని specify చేశారా? -

The Hon. Sri N. Sanjeeva Reddi:—దీనికి సమాధానము ప్రశ్నకు ఇచ్చిన జవాబులో రెండవ భాగములో ఉన్నది. Schools లో గాని, colleges లోగాని, Boy Scouts లో గాని, U. T. C. వగైరా వాటిలో Secretary గా గాని, Captain గా గాని ఉన్నారా అనియు, వారియొక్క విద్యా విషయమే కాకుండా, curricular activities లో కూడ వారి ప్రజ్ఞా విశేషాలు తెలుసుకోడానికి ఈ విధంగా అడుగబడుచున్నారు.

Sri K. Krishana Rao:—మొట్టమొదట జవాబు చెప్పుతూ "whose activities are extra-curricular" అని చెప్పారు. ఈ

1st November 1954]

extra-curricular గా political గా ఉండేటటువంటి students' organizations ఏవో అవి Public Service Commission వారికి చెప్పారా?

The Hon. Sri N. Sanjeeva Reddi:—"If so, the answer is in the negative" అని చెప్పాను. మీరు వినలేదేమో. మరల చదవమంటే చదువుతాను.

Sri K. Krishna Rao:—Extra-curricular activities లేకుండా, కేవలము మొదటి para కు సంబంధించినటువంటి students' organizations ఏవైనా ఉన్నాయని వారికి తెలుసునా?

The Hon. Sri N. Sanjeeva Reddi:—దీన్ని గురించి జవాబు రెండవ భాగంలో చెప్పాను. Boy scout organizations, U. T. C. organizations, వగైరా చాలా ఉన్నాయి. ఇవి Colleges కు సంబంధించినవి, politics తో సంబంధం లేనివి.

Sri K. Krishna Rao:—U. T. C., N C. C. ఇవన్నీ political organizations అన్న మాట.

The Hon. Sri N. Sanjeeva Reddi:—అన్నమాట అని మీరే చెప్పుతున్నారు.

Sri T. Nagi Reddi:—ఈ విధంగా Students' Organizations గురించి ఒక జాబితా ఇవ్వాలనేటటువంటిది ఎప్పుడు జారీచేశారు? ఇది మొదటినుంచి Public Service Commission Rules లో ఉన్నదా, లేక క్రొత్తగా వచ్చిందా?

The Hon. Sri N. Sanjeeva Reddi:—క్రొత్తది కాదు; పూర్వమునుంచీ ఉన్నది.

Sri G. Latchanna:—ఈ services కు వెళ్ళినవారినిగురించి, వారి student life లో వారి activities గురించి తెలుసుకోడానికి ఈ ప్రశ్న ఉన్నట్లుగా మంత్రిగారు సెలవిస్తున్నారు. ఇప్పుడు మంత్రులుగా ఉన్నవారు

తమ student life లో ఏ organizations కు సంబంధించినటువంటి వారని తెలుసుకొనే పద్ధతికూడ ఉంటుందా ?

No answer.

ACCIDENTS ON VIJAYAWADA—JAGGAYAPETA ROAD

* 2 Q. Sri V. Rama Rao —Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the number of accidents that took place on Vijayawada—Jaggayapeta road from 1st August to 31stDecember 1953; and

(b) the number of human lives lost in all these accidents ?

The Hon. Sri N. Sanjeeva Reddi·—(a) Seven accidents took place on the route Vijayawada to Jaggayapeta during the period 1-8-53 to 31-12-53.

(b) Three lives were lost in these accidents.

ఏడు ప్రమాదాలు జరిగినాయి. అందులో ముగ్గురు చనిపోవడం జరిగింది.

Sri Pillalamarri Venkateswarlu:—ఈ విజయవాడ - జగ్గయ్యపేట రోడ్డుయొక్క పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని కనీసము అక్కడ తారు రోడ్డయినా వేస్తేనేగాని ఈ accidents ఆపడానికి సాధ్యంకాదు. కనుక మంత్రిగారు దీనిని గుర్తించి వెంటనే ఆ రోడ్డు బాగుచేయడానికి చర్య తీసుకొంటారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi:—రోడ్డు బాగులేక పోవడానికి, accidents జరగడానికి ఏమి సంబంధం ఉన్నది? Vehicles ఒకదాని కొకటి ఢీ కొనడంవల్ల accidents జరిగాయి. ఒక విషయంలో conductor బయటికి తలపెట్టుకొని ఉండినందువల్ల, మరొక లారీ వచ్చి dash చేసింది. కనుక ఈ accidents ఆ vehicles నడిపే వారియొక్క గాని అందులోవున్న వారియొక్కగాని negligence వల్ల జరిగినవేగాని, రోడ్డు బాగుగాలేనందువల్లగాదు. వారి negligence వల్ల accidents జరిగి ముగ్గురు చనిపోవడం సంభవించింది.

1st November 1954]

Sri Pillalamarri Venkateswarlu.—ఏడు accidents జరిగాయని, అందులో ముగ్గురు చనిపోయారని చెప్పారు. అసలు ఈ accidents ఎక్కువగా జరగడానికి కారణము అక్కడ రోడ్డు చాలా అధ్వాన్నస్థితిలో ఉండడమే. ఆ రోడ్డు బాగులేనిదానివల్ల, tyres burst కావడం జరుగుతున్నది. బ్రిడ్జిలు కూడ చాలా hopeless గా ఉండడముచేత గూడ accidents జరుగుతున్నాయి. రోడ్డుమీద పోతూ ఉండేటప్పుడు ఇవి ఏవిధంగా జరిగేది చూస్తూనే ఉన్నాము.

The Hon Sri N Sanjeeva Reddi.—రోడ్డు బాగాలేదని అంటే నేనుకూడా అంగీకరిస్తాను. రోడ్డు బాగుచేయవచ్చు. కాని దానికి దీనికి ముడిపెట్టడం సరికాదు.

Sri K Rajagopala Rao—అయ్యా, Heavy traffic వల్ల ఆ రోడ్డులో చాలా accidents జరుగుతున్నాయి. ఈ లెక్కప్రకారమే నెలకు average ని 1½ accidents వరకు జరుగుతున్నట్లు తెలుస్తున్నది. కనుక ఆ రోడ్డును వెడల్పుచేసి accidents ను ఆపడానికి ప్రయత్నం చేస్తారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi.—Traffic చాలా ఎక్కువగాఉన్న మాట నిజమే. దాన్ని ఏ రకంగా control చేయాలనే విషయము ప్రభుత్వము ఆలోచిస్తున్నది. రోడ్డునుకూడ వీలైనంత త్వరలో బాగుచేయడానికి కృషిచేస్తుంది.

Sri P. V. R. Gajapathi Raju:—Could the accidents have been possible because Prohibition laws have not been effectively enforced ?

The Hon. Sri N. Sanjeeva Reddi:—దానికి, దీనికి సంబంధం లేదేమో అనుకొంటాను. అంతకంటె ఎక్కువ చెప్పితే బాగుండదు.

Sri S. Vemiah:—ఈ accidents లో చనిపోయినవారి పేరులు ఏమిటండీ ? వారికి ఏదైనా compensation యిచ్చారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi — పెర్లు నాకు తెలియవు. కాని చనిపోయినవారివిషయం కేసులుపెట్టడం, కొన్ని accidents క్రింద treat చేయడం, కొన్ని drivers మీద కేసులుపెట్టడం, accident కాదని prove అయినచోట compensation యివ్వడం జరిగింది.

* 3. Q. Sri Vavilala Gopalakrishnaiah.—ఆ కమిటీ పనిని ప్రారంభించి చేస్తున్నందువల్ల ప్రశ్న వేయడం లేదు.

Mr. Speaker:—This question is not put.

DISTRICT WELFARE OFFICERS.

* 4 Q. Sri T Lakshminarayana Reddi.—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state why the District Welfare Officers' posts were abolished and again retained?

The Hon. Sri D. Sanjivayya:—The posts of District Welfare Officers sanctioned in 1949 and continued upto 31st March 1949 were ordered to be abolished consequent on the creation of the posts of District Planning Officers in the grade of Deputy Collectors who were placed in charge of all Planning, Development and Welfare work in the Districts including Harijan Welfare. As there was a general feeling that the District Planning Officers might not be able to devote sufficient attention to Harijan Welfare work the Government revived the posts in the grade of Tahsildars to work directly under the Collector so that they could devote their undivided attention to Harijan Welfare and allied work.

Sri S. Vemaiah:—ఈ District Welfare Officers, Planning Officers క్రింద గుమాస్తాల మాదిరి, అంటే independent గా లేనందువల్ల Harijan Welfare work స్థంభించిపోతోందని ప్రభుత్వానికి తెలుసునా?

The Hon. Sri D. Sanjivayya—అది సరైన అభిప్రాయం కాదనుకొంటాను. అంతేకాకుండా ఈ District Welfare Officers ఎప్పుడూ direct గా Collectors క్రింద work చేస్తున్నారు.

1st November 1954]

Sri P Pundarikakshacharyulu —కొన్ని జిల్లాలలో District Planning Boards లో District Planning Officers 1954 వరకు కూడా appoint కాలేదు. ఎందుచేత ? 1949వ సంవత్సరంనుంచి 1954 సంవత్సరం వరకు అక్కడ ఈ Welfare Officers చేసే పని ఎవరు చేశారండీ?

The Hon. Sri D. Sanjivayya —Welfare Officer లే continue అయినారు.

REDUCTION OF SALES TAX ON FERTILIZERS

* 5. Q. Sri Pillalamarri Venkateswarlu (on behalf of Sri V. Rama Rao) —Will the Hon the Minister for Education and Industries be pleased to state—

(a) whether the Government have any proposal to reduce the Sales Tax on Fertilizers, and

(b) if so, to what extent?

The Hon. Sri S. B. P Pattabhirama Rao—

(a) No, Sir

(b) Does not arise

Sri G. Latchanna —ప్రభుత్వంలో proposal లేకపోతే ఎవరైనా వచ్చి represent చేశారండీ ఈ సమస్యమీద ?

The Hon. Sri S B. P Pattabhirama Rao—ఇది వేరే ప్రశ్నగా ఉంది. విచారించి మనవి చేస్తాను.

STARTING OF MODEL AGRICULTURAL FARMS IN EACH TALUK

* 6 Q Sri Pillalamarri Venkateswarlu (on behalf of Sri V. Rama Rao) —Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state—

Whether there is a proposal to start model Agricultural Farms in each Taluk?

The Hon. Sri P Thimma Reddi :— The answer is in the negative.

ప్రతి తాలూకాలో కూడా ఒక Agricultural Farm పెట్టవలెననే ఆలోచన లేదండి.

Sri Pillalamarri Venkateswarlu —ఎందువల్ల లేదండి.

The Hon Sri P. Thimma Reddi —ఎందువల్ల లేదంటే ఇప్పటికి మనకు 15 stations ఉన్నాయి. ఇంకా పెట్టవలెననే యోచన ఉంది. అనంతపురంలో Oil Seeds Research Station పెట్టాము. ఇంకా చిత్తూరులోను, ధోన్‌లోను, శ్రీకాకుళం జిల్లాలోను Agricultural Farms ను పెట్టాలనుకుంటున్నాము. అన్ని జిల్లాల్లోను ఎక్కడెక్కడ ఎప్పుడెప్పుడు పెడతామో, ఈ వచ్చే సంవత్సరానికి డబ్బు ఖర్చుపెట్టే సమయంలో చెప్పబడుతుంది.

Sri T. Nagi Reddi —ఎన్ని జిల్లాలలో ఈ Agricultural Farms ఉన్నాయి? ఏ యే జిల్లాలలో ఈ Agricultural Farms వున్నాయి?

The Hon. Sri P. Thimma Reddi — విశాఖపట్టణం జిల్లాలో, Aruku Valley లోను, అనకాపల్లిలోను Agricultural Research Stations ఉన్నాయి. ఇంకా Sugarcane Research Station, Samalkota, Government Paddy Farm, Maruteru, Deep Water Rice Station, Pulla, College Farm, Baptla, Agricultural Research Station, Guntur, Fruit Research Station, Nandyal, Government Agricultural Demonstration Farm, Kalahasthi, Millet Farm, Ongole, Government Millet Farm, Vizianagram, Model Orchard-cum-Nursery, Peddapuram, Orchard and Nursery, Giddaluru ఉన్నాయి.

Sri K. Govinda Rao:—ఇప్పుడు ప్రజలకు బాగా వినియోగపడుతున్న అనకాపల్లి వ్యవసాయ క్షేత్రంలాంటి వాటిని ఇంకా అభివృద్ధి చేయటానికి ప్రభుత్వం ఏమైనా ప్రయత్నం చేస్తుందా?

The Hon. Sri P. Thimma Reddi:—ఇపుడు నాగిరెడ్డిగారు వేసిన ప్రశ్నలో అన్ని జిల్లాలలోను ఈ farms ను అభివృద్ధి చేయటానికి ఏమైనా ప్రభుత్వం ప్రయత్నిస్తోందా? అని అంటే, కృష్ణా, శ్రీకాకుళం జిల్లాలలో ఈ farms ను పెట్టాలని అనుకుంటున్నాము, ప్రతి జిల్లాలో కూడా పెట్టడానికి ప్రయత్నం చేస్తాము, అని సమాధానమిచ్చాను.

1st November 1954]

Sri Pillalamarri Venkateswarlu:—కృష్ణా జిల్లాలోను శ్రీకాకుళం జిల్లాలోను లేవన్నారు. ఈ రెండు జిల్లాలలోనూ వెంటనే పెట్టటానికి పూనుకుంటారా ? లేకపోతే ఇంకా ఏమైనా ఎక్కువకాలం అవసరం ఉంటుందా ?

The Hon. Sri P. Thimma Reddi—ఎక్కడ పెట్టాలనేది సభ్యులందరికీ తెలుసును. పెట్టాలని ఉంది, పెడదామనే.

Sri T. Nagi Reddi—అనంతపురంలో Agricultural Farm ఒకటి ఉందని అన్నారు. అది ఎక్కడ ఉన్నది ?

The Hon. Sri P Thimma Reddi—Oil Seeds Research Station ఉంది. ఈ మధ్య జిల్లాలో లేరనుకొంటాను.

Sri T. Nagi Reddi :—Oil Seeds Research Station కి, Agricultural Research Station కి భేదం వుందని మంత్రిగారికి తెలుసా ?

The Hon. Sri P. Thimma Reddi:—అనంతపురంలో Agricultural Research Farm కి, Oil Seeds Research కి కూడా అక్కడ 30 ఎకరములు తీసుకొని వివిధ రకముల వేరుశనగ, మన రాష్ట్రంలోనివి, ఇతర రాష్ట్రములలోనివి అన్నీ కూడా పైరు చేస్తున్నాము. ఆముదము, నువ్వులు, అలాంటివి అన్నీకూడా పైరు చేస్తున్నాము. మీకు వీలైతే అక్కడకువచ్చి చూచి, మీకు తోచిన సలహాలనిస్తే బాగుంటుంది.

Sri T. Nagi Reddi —ఆ 30 ఎకరాలలో నువ్వులను, ఇంకా ఎన్నింటినో పెట్టాలంటే, ఆ 30 ఎకరాలు చాలతాయా ?

The Hon. Sri P. Thimma Reddi:—ఇది research station. వ్యాపారంకోసం, బ్రతుకుకోసం కాదు. ఆ 30 ఎకరములలో అవే కాక ఇంకా ఏమైనా పెట్టవచ్చు.

Sri C. Subbarayudu:—బళ్లారి మైసూరులో చేర్చబడినందువల్ల హాగరి, సిరిగుప్పలలో ఉన్న farms Mysore కి పోయాయికదా; మరి

రాయలసీమ black cotton area లో cotton and oil seeds research farme ను పెట్టడానికి ఆలోచనలు ఉన్నాయా? త్వరలో పెట్టేదానికి ప్రయత్నిస్తారా?

The Hon. Sri P. Thimma Reddi.—నంద్యాలలో cotton and oil seeds research station ఉంది. అక్కడ పైరుచేస్తున్నాము. దానిని ఇంకా అభివృద్ధిచేసి, హెచ్చుస్థాయిలో పెట్టమంటే పెడతాము.

Sri P. Venkatasubbayya.— ప్రతి తాలూకాలోనూ agricultural farm పెట్టేటటువంటి ఆలోచన లేనపుడు కమలాపురం తాలూకా పెద్దలేబాక గ్రామంవద్ద 100 ఎకరముల భూమికొరకు పేద రైతులు apply చేస్తే ఆ భూమి అచట agricultural farm పెడితే కావాలి, అందుచేత ఆ భూమిని యివ్వడానికి వీలులేదన్నారు. దానిని ఇపుడు సవరించి అక్కడి రైతులకు మళ్ళీ యిస్తారాండి?

The Hon. Sri P. Thimma Reddi:— ఇప్పుడు పెట్టుట లేద న్నాను కాని ఎప్పటికీ లేదా! ఎపుడో అపుడు పెట్టాలి. అందుకు చర్యలు తీసుకుంటాను.

Sri G. Latchanna:—కృష్ణా, శ్రీకాకుళం జిల్లాల్లో agricultural farms పెట్టాలని ఇపుడు ప్రభుత్వం ఆలోచిస్తున్నదన్నారు. శ్రీకాకుళం జిల్లాలో ఎక్కడ ఈ farm పెట్టబోతున్నారో సెలవిస్తారా?

The Hon. Sri P. Thimma Reddi:—శ్రీకాకుళంజిల్లాలో ఉద్యానం area ఉంది. అక్కడ కొబ్బరిపంట బాగాఉంది. తరువాత జీడిపప్పు బాగా పండుతుంది. అక్కడ ఏరక్ నట్ కూడా పైరుచేయాలని యోచన. దీనికి కేంద్రప్రభుత్వంయొక్క సహాయం ఎక్కువగా వస్తుంది. కేంద్ర ప్రభుత్వంతో సంప్రతింపులు చేస్తున్నాము.

## COLLECTION OF TAKKAVI AND SUBSISTENCE LOAN INSTALMENTS IN CU DAPAH DISTRICT.

* 7. Q. Sri P. Narasimha Reddi (on behalf of Sri N. Sivarami Reddi):—Will the Hon. the Minister for Land Revenue be pleased to state the action taken on the memo-

randum presented to him on 2nd January 1954 by Sri N. Sivarami Reddi, M. L. A., and Sri P. Narasimha Reddi, M. L A , regarding the postponment of the collection of takkavi and subsistence loan instalments in Cuddapah District?

The Hon. Sri K. Koti Reddi.—When considering the question of the need or otherwise of relief to the ryots in the matter of collection of land revenue and instalments, the memorandum also was taken into account By an order dated 23—1—1954 loan instalments due in Fasli 1363 in Rayachoti Taluk had been suspended. Subsequently, by an order dated 6—8—1954 the Government have directed that the recovery of all uncollected current and arrear takkavi loan instalments due in Fasli 1363 are postponed till 1—1—55 in the entire area of Cuddapah District.

Sri T. Nagi Reddi:—ఈ ప్రశ్నలో అసలు ఏదో పొరపాటు ఉన్నట్లు ఉంది. 1954 లో ఇచ్చినటువంటి మహజరుకు 1.1.55 వరకూ collect చేయడం లేదంటే తక్కావీ లోన్స అనా? దాని అర్థం ఏమిటి?

The Hon. Sri K. Koti Reddi:—1363 వ ఫసలీలో వసూలు కావలసిన మొత్తం 1.1.1955 వరకు postpone చేశాం.

MANAGEMENT OF CUDDAPAH-BALUPALLE ROAD.

* 8. Q. Sri P. Narasimha Reddi:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state-

(a) Whether the District Board, Cuddapah, requested the Government to take over the management of Cuddapah-Balupalle Road to its Highways Department; and

(b) if so, the action taken thereon?

The Hon. Sri N. Sanjeeva Reddi:—

(a) The answer is in the affirmative.

(b) The request is under the consideration of the Government.

[1st November 1954

అయినా ఇంకా కొంతఉన్న information ఇస్తే supplementaries అడగకుండా ఉంటారనే ఉద్దేశ్యంతో చెపుతున్నాను. ఇది 29 మైళ్ళ పొడుగు రోడ్డు. దీన్ని గవర్నమెంట్ స్వాధీనం చేసుకుంటే 12 లక్షల రూపాయలు అదనంగా ఖర్చు అవుతుంది. కాబట్టి బాగుచేయడానికి వీలు లేదని మొదట్లో అనుకున్నప్పటికీ, పునరాలోచించమని వారి దగ్గరనుంచి మరో అర్జీ రావడంవల్ల అంతా చేసినా చేయలేకపోయినా కొంతవరకు అయినా బాగుచేద్దాం అనుకొన్నాం. దానికికూడా దాదాపు రెండు లక్షల రూపాయలు అవుతుంది. 12 లక్షల రూపాయలూ ఒక్కసారిగా ఖర్చు పెట్టడానికి సాధ్యంకాదని చెపుతున్నాను.

**Sri P. Narasimha Reddi:**— ఈ రోడ్డు కర్నూలునుంచి మద్రాసుకు పోయేదానికీ, కర్నూలునుంచి తిరుపతికి పోయేదానికి ముఖ్యమైనరోడ్డు. ప్రతి సంవత్సరము వర్షాకాలములో పోయేదానికి వీలు కాకుండా ఉంది. కాబట్టి దీన్ని సత్వరమే బాగుచేయడానికి ఆలోచిస్తారా అని అడుగుతున్నాను.

**The Hon. Sri N. Sanjeeva Reddi:**—ఈ ప్రశ్న రావలసిన అవసరంలేదనే ఉద్దేశ్యంతో చెప్పాను. ఒకతూరి రిజెక్టుచేసినా, దాన్ని మళ్ళీ ఆలోచిస్తున్నాం అంటే దానియొక్క ప్రాముఖ్యత తెలుసుకోవచ్చు. కాని ఒకేతూరి 29 మైళ్లు తీసుకోలేము. ఒక్క రోడ్డుకు 12 లక్షలు ఖర్చుపెట్టాలంటే రాష్ట్రంలో ఇంతే ముఖ్యమైనరోడ్లు ఇంకా ఎన్ని ఉన్నాయో మీరు తెలుసుకుంటే బాగుంటుంది. ఈ సంవత్సరానికి రెండులక్షల రూపాయలతో పనిచేసుకుందాం అనుకున్నాం. మన financial position బాగుంటే తప్పకుండా ఇంకా ఎక్కువ తీసుకోవాలనే మా ఆశ.

**Sri B. Krishnamurthy Rao:**—అధ్యక్షా! రాష్ట్రం మొత్తం మీద జిల్లాబోర్డుల అధీనంలోఉన్న రోడ్లన్నీకూడా హీన పరిస్థితిలో ఉన్నాయి. కనీసం రేపు రాబోయే బడ్జెట్ సమావేశంలో జిల్లాకు ఒకొక్క రోడ్డుప్రకారం, కడపజిల్లాలోనేకాక రాష్ట్రంలో జిల్లా బోర్డుల ఆధిపత్యంలోవున్న రోడ్లన్నీ ప్రభుత్వం స్వాధీనం చేసుకోడానికి ప్రయత్నిస్తుందా?

1st November 1954]

The Hon. Sri N. Sanjeeva Reddi.—ఆ రోడ్డుయొక్క ప్రాముఖ్యతనుబట్టి దానియొక్క అవసరాన్నిబట్టి, దానియొక్క condition ను బట్టి తప్పకుండా ఆలోచిస్తాం.

Raja Sri Sagi Suryanarayana Raju·— అధ్యక్షా ! సంజీవ రెడ్డి గారు పదేపదే పెటీషన్లుపెడితే ఆలోచిస్తాం అని చెప్పారు. ఏమో ఒకసారి చెప్పితే ఆలోచిస్తారని అనుకున్నాం. అందుచేత ఇంకా 10 పెటిషన్లు పంపించమంటే పంపిస్తాం. మా రోడ్డు నాలుగుమైళ్లే కాబట్టి ఒక లక్ష రూపాయలు కాదు, 50 వేల రూపాయలు సరిపోతుంది. కాబట్టి దానికి ఏమి సెలవిస్తారు అని అడుగుతున్నాను.

The Hon. Sri N. Sanjeeva Reddi:—ఏరోడ్డు అది?

Raja Sri Sagi Suryanarayana Raju:— ట్రంకురోడ్డు మొదలుకుని పోలవరంవరకు 4 మైళ్లు ఉంది. మోటారుకారులేకావు బళ్లుకూడా తిరగబడిపోతున్నాయి.

The Hon. Sri N. Sanjeeva Reddi:— నేను ఈ విషయాన్ని ఇంజనీర్లకు పంపించి దానికి తగిన శ్రద్ధతీసుకోమని చెప్తాను.

Sri K. Adikesavulu Naidu.—కడప - బాలుపల్లి రోడ్డు రేణిగుంటవరకు repair చేస్తే ఆ రోడ్డు ప్రాముఖ్యమైనదిగా ఉంటుంది. కాబట్టి ఇది బాలుపల్లివరకేనా లేక రేణిగుంట వరకు repair చేయిస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi:—ఈ మధ్య వీరుకూడా నాగిరెడ్డిగారితో ఒక ప్రశ్న ఇక్కడ across the table వేశారు. కోడూరు నుంచి బాలుపల్లి వరకు ఈ రోడ్డు hills లో పోతుంది. కడప నుంచి కోడూరు వరకు ఈ రోడ్డు బాగానేఉంది. కోడూరునుంచి బాలుపల్లికి పొయ్యేది చాలా అధ్వాన్నంగా ఉంది. ఇది కొండల్లోనుంచి forest లో నుంచి పోతుంది. కాబట్టి దీనికి 2 లక్షలు అవుతుంది. వారు అడిగేది బాలుపల్లికేకాదు. తిరుపతివరకు అయితేనే ఈ రోడ్డుయొక్క ఉపయోగం, బాలుపల్లి వరకు అయితే నిరుపయోగం అని వారి అభిప్రాయం.

[1st November 1954

Sri Vavilala Gopalakrishnaiah:—గుంటూరు జిల్లాబోర్డు రోడ్లమీద మోటార్లు నడిస్తే ప్రాణప్రమాదం ఉంటుందనీ కాబట్టి licence లు cancel చేసి, repair చేసేవరకు ఆపుచేయవలసిందని ఇంజనీరు వ్రాశారు. అచ్చంపేట, నరసారావుపేట రోడ్డుమీద అమృతలూరు దగ్గరనుంచి బస్‌లో పోయిన ప్రాణప్రమాదం వస్తుంది, అందువల్ల licence లు ఆపాలని గవర్నమెంటుకి వ్రాశారు. అందువల్ల ఈ ప్రమాదంలోవున్న రోడ్లను వెంటనే గవర్నమెంటు undertake చేసి బాగుచేస్తారా? అని అడుగుతున్నాను.

The Hon. Sri N. Sanjeeva Reddi:— జిల్లా, జిల్లాలో ఉన్న రోడ్లన్నీ తీసుకోవాలంటే కష్టం. చాలా రోడ్లు అధ్వాన్నస్థితిలో ఉన్నాయని నాకూ తెలుసు. అన్నిటిగురించి సమాధానం చెప్పడం సాధ్యంకాదు.

Sri K. Veeranna Padal:—అధ్యక్షా! విశాఖపట్నం ఏజెన్సీలో పూర్వం P. W. D. వారు రోడ్లు formation చేస్తే చాలా బాగుండేవి. ఇప్పుడు Highways వారికి handover చేసిన తరువాత రోడ్లు బాగా పాడైనాయి. వీనిని P. W. D. కి ఇస్తారా? లేక గవర్నమెంట్ రోడ్లు సరైన స్థితిలో ఉండేటట్లు చేస్తారా ?

Sri K. Rajagopala Rao:—Point of order Sir, ఇప్పుడు కడప, బాలుపల్లి రోడ్డుదగ్గర బయలుదేరి రాష్ట్రంలోఉన్న రోడ్లన్నీ తిరుగుతున్నాం. సంజీవరెడ్డిగారు అన్నీ consider చేస్తాం అంటారు. అందుచేత తమరు కొంచెం restrict చేయాలని కోరుతున్నాను.

## BORSTAL SCHOOLS IN THE STATE.

* 9 Q. Sri K. Krishna Rao:— Will the Hon. the Minister for Finance and Law be pleased to state-

(a) how many Borstal Schools there are in the Andhra State and if there are no such, the arrangements made in the case of adolescent offenders who are to serve sentence under section 7 of the Borstal Schools Act; and

(b) the arrangements that the Government are making to open more Borstal Schools, in the State subsequent to 1st October 1953?

1st November 1954]

The Hon Sri T. Viswanatham:—

(a) There are no Borstal Schools in the Andhra State. Adolescent offenders sentenced to detention in Borstal school by Courts in the Andhra State are to be detained in the Borstal School, Bellary which is made available to this Government, for a period of five years from 1-10-1953 (Central Act XXX of 1953), read with part XX of the Eighth Schedule to that Act.

(b) The question of opening a Borstal School in this State is under consideration.

ఆంధ్ర రాజ్యంలో Borstal Schools ఎక్కడ లేవు. Borstal School లో ఉంచుటకుగాను శిక్షింపబడినవారిని బళ్ళారిలోని Borstal School లోనికి పంపడం జరుగుతున్నది. ఈ ఏర్పాటు Andhra Act క్రింద చేసిన ఏర్పాటు. ఒక Borstal School మన రాజ్యంలోకూడా ఏర్పాటు చేద్దాం అని ఆలోచనలో ఉంది.

Sri K. Krishna Rao·—ఇప్పుడు Borstal School Act క్రింద short imprisonment రెండు మూడు మాసాలు undergo అవుతున్న వారిని అక్కడక్కడ sub-jails లో adults తో కలిపిఉంచడం జరుగుతున్నది. వాళ్లను segregate చేయడానికి ఏమైనా ప్రయత్నం చేస్తారా?

The Hon. Sri T Viswanatham:--మొదట ఒక aspersion. ఆ aspersion ఒప్పుకొని జవాబు చెప్పమంటారు. అది ఒప్పుకోడం కష్టం. అటువంటివి ఏమైనా ఉంటే ప్రత్యేకంగా వాళ్లను ఉంచడానికి ఏర్పాట్లు వెంటనే జరుగుతాయి.

Sri K. Subba Reddi:—ఆంధ్రలో ఎక్కడ borstal school ఏర్పాటు చేయడంకోసం మీరు ఆలోచిస్తున్నారు.

The Hon. Sri T. Viswanatham:—ఎక్కడ తావు, స్థలం, భవనం, సౌఖర్యాలు వీలుగాఉంటే అక్కడ.

Sri K. Krishna Rao·—అధ్యక్షా! నెల్లూరు sub-jail లో కొంతమంది borstal school కు అర్హత ఉండినవాళ్లను అక్కడ

[1st November 1954

అడల్ట్స్‌తో బాటు ఉంచారు. నేను చూచాను, ప్రభుత్వానికి తెలిపాను. కాబట్టి వాళ్లను segregate చేయడానికి ప్రయత్నం చేస్తారా అని అడుగుతున్నాను.

The Hon Sri T. Viswanatham —తక్కువకాలం అయితే బహుశా దూరం పంపించి ఉండరు మీరు వారిని చూచినారేమో నాకు తెలియదు. బళ్ళారి పంపవలసిఉంటే ఈపాటికి వాళ్లను పంపే ఉంటారు.

Sri G. Latchanna:—బళ్ళారి Borstal school లో ఉన్నటువంటి ఈ minor boys కు ration ఏవిధంగా supply అవుతున్నదో శెలవిస్తారా ?

The Hon. Sri T. Viswanatham:—Rations సవ్యంగానే supply అవుతున్నాయి.

Sri G. Latchanna:—ఎన్ని ఔన్సుల బియ్యం supply అవుతున్నదో చెప్తారా ?

The Hon. Sri T Viswanatham:—ప్రత్యేక ప్రశ్నవేస్తే సమాధానం చెప్తాను.

ACQUISITION OF HOUSE-SITES FOR HARIJANS OF KANUMOLU OF GANNAVARAM TALUK

* 10. Q. Sri G. Rama Rao —Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state-

(a) The stage at which the question of acquisition of house-sites for Harijans of Kanumolu of Gannavaram taluk stands at present;

(b) When the application for house-sites was filed in office, and when draft notification was published in the Gazette and the amount collected from the Harijans towards the cost of acquisition;

(c) Whether the acquisition was withdrawn and if so, when and for what reasons: and

1st November 1954]

(d) Whether this case was closed for ever or kept pending in the office?

The Hon. Sri D. Sanjivayya :—

(a) The question has been dropped.

(b) The application was filed on 17-2-1950, and the draft Notification was published on 18-7-1950. An amount of Rs. 1060/—towards the cost of acquisition was collected in 4 instalments on 28-6-1948, 22-9-1948, 30-12-1948 and 6-1-1949

(c) The acquisition was withdrawn on 10-6-1953 for the following reasons :—

(1) In 1952 the Government laid down a policy to the effect that wet lands should not be acquired for house building purposes when suitable alternative dry lands are available for the purpose ;

and (2) the Harijans of Kanumolu refused to accept the alternative dry lands which were available.

(d) The case was closed.

(a) ఈ సమస్య విషయంలో చర్య ఆపుదల చేయబడింది. (b) 17-2-1950 వ తేదీన దీని విషయంలో అర్జీ దాఖలు చేయబడింది. ప్రకటన చిత్తుప్రతి 18-7-1950 వ తేదీన ప్రచురింపబడింది. రు. 1,060 లు యీా భూమిని స్వాధీనం చేసుకొనుటకు నిమిత్తం అయ్యే ఖర్చుకుగాను, నాలుగువంతులు వారిగా, 28-6-1948, 22-9-1948, 30-12-1948, 6-1-1949 న వసూలు చేయబడింది. (c) ఆపుదల చేయడానికి కారణాలు:—

1952 వ సంవత్సరంలో ప్రభుత్వ విధానం ప్రకారం మెరకపొలాలు వుండినట్లైతే ఆ సమీపంలోని తరి పొలాలు యిండ్లస్థలాల నిమిత్తం స్వాధీనం చేసుకోకూడదు. ఆ కారణంచేత దగ్గరవున్న మెరక పొలాలను తీసుకోమని హరిజనులను అడుగగా వారు నిరాకరించిన కారణంచేత ఆపుదల చేయబడింది.

Sri Kolla Venkaiah :—ప్రభుత్వ ఉత్తర్వు ప్రకారము మెరక పొలాలు వున్నటువంటి చోట, తరి పొలాలు తీసుకోకూడదని చెప్పారు. మెరకపొలాలు లేనటువంటి చోటకూడా, తరి పొలాలుకూడా యివ్వకుండా వుండే సంఘటనలు ప్రభుత్వ దృష్టికి వచ్చాయా ? వాటిపైన యేమైనా చర్య తీసుకున్నారా ?

The Hon. Sri D. Sanjivayya—లేదుకాని, వచ్చివుంటే తప్పకుండా చర్య తీసుకుంటాము. ఇప్పుడు యేమైనా అలాంటివి మా దృష్టికి తెస్తే, చర్య తీసుకుంటాము.

Sri T. Nagi Reddi.—ఈ ప్రశ్నలో 1948 మొదలు 1952 వరకు వరుసపెట్టి, మంత్రిగారు చెప్పారు. 1950 లో sanction చేసిన యీ house-sites, notification ద్వారా 1952 వరకు ప్రభుత్వము యెందుకు హరిజనులకు స్వాధీనముచేయలేదు. 1952 లో నూతన ప్రభుత్వము, నూతన ప్రభుత్వ విధానము యేర్పాటుచేస్తే, యిప్పుడు ఆంధ్రరాష్ట్రము యేర్పడిన తరువాత వచ్చిన నూతన ప్రభుత్వం, నూతన ప్రభుత్వ విధానమును యేర్పరచి తిరిగి యిప్పించడానికి ప్రయత్నం చేస్తుందా ? అని అడుగుతున్నాను.

The Hon. Sri D. Sanjivayya:—ఇది ఆంధ్రరాష్ట్రం యేర్పడక పూర్వము అంటే 10-6-1953 ఆపుదల చేయబడింది. తరువాత, స్థానికంగావున్న హరిజనులు అర్జీ పెట్టుకున్నట్టు లేదు. అర్జీ పెట్టుకున్నట్లైతే తప్పకుండా ఆలోచిస్తాము.

Sri T. Nagi Reddi:—ఇది నేను అడిగిన ప్రశ్నకు సమాధానంగా రాలేదండి. 1948 లో డబ్బు యిచ్చారు. 1950 లో sanction చేశారు. 1952 లో withdraw చేశారు. అంటే, దానికి నాలుగు సంవత్సరాలు పట్టింది. 1952 వ సంవత్సరంలో withdrawal తరువాత, 1954 వరకు ప్రభుత్వం దీని విషయంగురించి ఆలోచించలేదు. డబ్బు యివ్వలేదు. బహుశః డబ్బుకూడ వెనుకబడి యిచ్చినట్లుగా నేను అనుకోను. ఆపుదల చేయబడింది కాబట్టి డబ్బు దగ్గర పెట్టుకొని, భూమి యివ్వకుండా ప్రభుత్వ

1st November 1954]

విధానం యిట్లా కొనసాగుతోంది. ఒక సంవత్సరం తరువాతనైనా ఇప్పుడు దీనిని మార్చడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా ?

The Hon. Sri D Sanjivayya:—1953 అక్టోబరు 1 వ తేదీ తరువాత, మేము యేమీ అభ్యంతరం పెట్టటంలేదు. అక్టోబరు ఒకటవ తారీఖునుంచి నేటివరకూ అటువంటి complaint యేమీ రాలేదు.

Sri Saka Venkata Rao:—అర్జీలో పేర్కొనబడినటువంటి ఆ పల్లపుభూమిగల ఆసామి యెవరో చెపుతారా ?

The Hon. Sri D. Sanjivayya:— ఆసాములపేర్లు యిక్కడ లేవు. కావాలంటే తెప్పించి చెపుతాను.

Mr. Speaker:— Sri S. Venkata Rao is not in his proper place. శ్రీ లక్ష్మీనారాయణ రెడ్డిగారు అక్కడకుపోయి, శ్రీ వెంకట్రావుగారు యిక్కడకు వచ్చి కూర్చోండి.

Sri T. Nagi Reddi.—లక్ష్మీనారాయణ రెడ్డిగారి కాలుకొంచెము fracture అయింది కాబట్టి కొసను కూర్చున్నారు.

Sri K. Ranga Rao:—అయ్యా, ఇప్పటికి మన ప్రభుత్వం వచ్చి ఒక సంవత్సరం అయిందికదా. ఈ సంవత్సరం లోపుగా ప్రభుత్వం ఇండ్ల స్థలాలు కేటాయించు పద్ధతినైనా revise చేసి హరిజనులకు యివ్వవలసిన బాధ్యత వున్నది. మంత్రిగారికి పూర్తిగా వారి కష్టాలు తెలుసు కాబట్టి యిప్పుడైనా ఆలోచించి తక్షణం ఇండ్లస్థలాలు sanction చేస్తారా ?

The Hon. Sri D. Sanjivayya:—ఇప్పుడు ప్రభుత్వం ముందు అర్జీలు చాలా వున్నాయి. ఇప్పుడు యీ అర్జీ మా దగ్గర లేదు. 10-6-53 తేదీననే యిది ఆపుచేయబడింది. తరువాత మళ్లీ అర్జీ పెట్టలేదు.

Sri G. Rama Rao:—అసలు యీ కానుమోలులో యెక్కడా మెరకభూములు లేనేలేవు. అసలు office యెందుకు వ్రాశారో మాకు తెలియదు. అలా కాకపోయినప్పటికీ కూడా ఈ విధంగా జరిగింది.

అయినప్పటికీ, డబ్బు యివ్వకుండా, వారు యీ విషయంలో చెప్పకోకుండా ఆపుచేశారు. ఇందులో ఏదో కుట్ర వుందని యీ పరిస్థితి తెలుసుకొని, ఈ విషయంలో చెప్పకోకుండా యిచ్చేదిలేదని, కాంగ్రెసువారు వారిని ఆపుచేశారు. తరువాత యిందులోని కుట్ర బయటపడింది. ఈ విషయాలు ఆలోచించకుండా పై పై వచ్చిన రిపోర్టులు మాత్రం బయట పెడుతున్నారే. మొట్టమొదట ఆ స్థలాలు హరిజనులు కావాలన్నారు. ఆ స్థలాలను మళ్లీ యివ్వడానికి తిరిగి proposals పంపిస్తారా ?

The Hon. Sri D. Sanjivayya —ఇక్కడ యేదో కుట్ర వున్నదని తెలియదు. ఇప్పుడు వారు యేదో కుట్ర వున్నదని చెబుతే, యిప్పుడు నాకు తెలిసింది. అటువంటి కుట్ర యేదైనా వున్నట్లైతే ఆ కుట్ర ఏమిటో విచారించే వాడిని. ఇప్పుడు మళ్ళీ వారు యిండ్లస్థలాలు కావాలని అర్జీ పెట్టుకుంటే దాని విషయంలో విచారిస్తాను.

Mr. Speaker:—Sufficient supplementaries have been answered.

### GOVERNMENT TECHNICAL (WEAVING) EXAMINATION CENTRES FOR STUDENTS.

* 11. Q Sri P. Narasimha Reddi —Will the Hon. the Minister for Education and Industries be pleased to state—

(a) whether there is any Government Technical Examination centre (craft) for Weaving students in Rayalaseema area;

(b) whether it is a fact that students from Pullampet, Madhavaram, etc., villages in Rayalaseema constitute a majority of the students that took the said examination at Guntur centre, from the last three years; and

(c) whether the Government propose to establish an examination centre at Pullampet?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—

(a) The answer is in the negative.

(b) Information is not available regarding the number of candidates who appeared from the Rayalaseema area

1st November 1954]

during 1952 and 1953 Out of 166 Andhra candidates that appeared for April, 1954, Examination in Handloom Weaving, only 17 were from the entire Rayalaseema area.

(c) Pullampet will be made a centre for Government Technical Examination in Handloom Weaving for Lower Grade.

Sri P. Narasimha Reddi —ప్రశ్న వేసి చాలాకాలం అయింది కదా, information లేదని చెపుతున్నారు. కాని information తెప్పించి చెపుతామన్నారు. ఇంకొక విషయం, Lower Grade కు మాత్రమే పరీక్షాకేంద్రము పెడతామన్నారు. పుల్లంపేట ప్రశస్తమైన ప్రాంతం కాబట్టి, అక్కడ యెక్కువమంది weavers వున్నారు కాబట్టి Higher Grade కు వున్నతస్థాయిలో training centre యెందుకు open చేయలేదని అడుగుతున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—ప్రశ్నలోని మొదటి భాగానికి జవాబు: 1952-53 పరీక్షలయొక్క వివరాలు మన ప్రభుత్వ రెకార్డులలో లేవు. వాటిని తెప్పించడానికి ప్రయత్నించినా సాధ్యం కాలేదు.

రెండవ భాగానికి జవాబు: పుల్లంపేటలో centre పెట్టటం విషయంలో పరీక్ష చేయించాము. దానికి Sri S Krishnamurthy, B.Sc., Reader in Textile Technology, Madras University పరీక్ష అధికారికూడాను. ఆయన వెళ్ళి పరిశీలించి, దానికి తగినటువంటి వీళ్లు అక్కడ లేవు, పరీక్షలు చాల వుత్తమతరగతిలో జరగాలి, examinations వుత్తమస్థాయిలో జరగాలి, అక్కడ అందుకు అవకాశము లేదు కనుక Lower Grade కు మాత్రమే ఆయన recommend చేశారు. ఆయనయొక్క recommendation ప్రభుత్వము అంగీకరించింది.

Sri Pragada Kotaiah :—అసలు handloom weaving లో Higher Grade, Lower Grade Examinations జరుపడానికి, ఆంధ్రదేశంలో వున్నటువంటి centres యేమిటి? అక్కడవున్న వసతులు యేమిటి?

[1st November 1954

The Hon. Sri S. B P. Pattabhırama Rao — ఆంధ్ర దేశంలో పరీక్షలు జరుగుచున్నవి రెండు సెంటర్లు. (1) రాజమండ్రి, (2) గుంటూరు.

Sri Pragada Kotaıah '—వసతులు యేమిటండి ?

The Hon. Sri S. B. P. Pattabhırama Rao.—దానికి మీరు ప్రత్యేక ప్రశ్నవేస్తే, మీకు సమాధానము దాఖలు చేస్తాను.

Sri T. Nagi Reddi —శ్రీ కృష్ణమూర్తి యేదో పరిశీలన జరిపి, పుల్లంపేటలో Hıgher Grade Examınatıon centre open చేయ డానికి పరిస్థితులు వీలుగా లేవని మంత్రిగారు చెప్పారు. అసలు, అందుకు యెలాంటి పరిస్థితులు వుండాలి. ఎలాంటి పరిస్థితులు లేవని వారు report యిచ్చారో, ఆ రిపోర్టులోని gist కొద్దిగానైనా చెబుతారా ?

The Hon. Srı S. B. P. Pattabhirama Rao :—రిపోర్టు యిక్కడ హాజరుగా లేదు కాని, దానికి సంబంధించి prepare చేసిన notes లో నుంచి మనవిచేస్తాను.

The adequacy of facılities available for the purpose at Pullampet, an ımportant handloom centre has been examıned by Sri S. Krishnamurthi, B. Sc., Reader ın Textıle Technology, University of Madras and Examıner of Handloom Weaving, Government Technical Examınatıons, Andhra State. He consıders that for the present the conduct of examinations at Pullampet Centre may be restrıcted to Handloom Weavıng, Lower Grade and ıt may not be possible to hold practical examinatıons in Handloom Weaving, Higher Grade, at Pullampet Centre, as things exist at present.

Sri T. Nagi Reddi:—ఇక్కడ ప్రశ్న ఒకటే అండి. ఏ కారణాల చేత పుల్లంపేటలో హయ్యరుగ్రేడు పరీక్షలు ఏర్పాటు చేయడానికి వీలు లేక పోయింది, అనే ప్రశ్నకు కొంచెము జవాబు ఇస్తే అసలు అడిగిన ప్రశ్నకు కొద్దిగా సమాధానము ఇచ్చినట్లు అవుతుంది. లేకపోతే ప్రశ్న అడిగినట్లు మీరు వేగ్ ఆన్సరు యిచ్చినట్లు అవుతుంది. No answer ıs forthcoming.

1st November 1954]

The Hon. Sri S. B. P Pattabhirama Rao.—ఇక్కడ వేగ్గా సమాధానం యిచ్చినట్టుకాదు. అందులో వున్నంతవరకు సమాధానం యిచ్చాను. ప్రత్యేకమైన ప్రశ్న వేస్తే రిపోర్టు తెప్పించి సమాధానం ఇస్తాను. అసలు ప్రశ్నకుమించి వుపప్రశ్న వేస్తే అసలు ప్రశ్నకంటే పెద్ద ప్రశ్న అవుతుంది. సమాధానము చెప్పడము కష్టము.

Sri Pragada Kotaiah.—అధ్యక్షా! ఈలోయరుగ్రేడు, హయ్యరుగ్రేడు పరీక్షలు జరపడానికి ప్రత్యేకమైన పనిముట్లు కావాలి. సాధారణంగా మన మగ్గాలతో సాధ్యపడదు. అందువల్ల ఆంధ్రదేశంలో పరీక్షలు నిర్వహించే అవకాశాలు లేవు. అలాంటి అవకాశాలు కల్పించే నిమిత్తం ప్రత్యేకంగా మన రాష్ట్రంలో కూడా ఒక నేత కళాశాల పెట్టే విషయము ప్రభుత్వము యోచిస్తున్నదా అని అడుగుతున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao.—శ్రీ కోటయ్యగారు అడిగిన ప్రశ్నకు సమాధానము ప్రశ్నలోనే వుంది. దానికి కావలసిన పనిముట్లు లేవు, అందువల్ల పెట్టడానికి వీలులేదని చెప్పారు. బహుశః పుల్లంపేటలో కూడా అదే కారణము అయి ఉంటుందని నేను వూహిస్తున్నాను. వారు చెప్పిన విషయము గురించి పరీక్ష చేయించి ఏమి చేయడానికి వీలౌతుందో ఆలోచిస్తానని మనవిచేస్తున్నాను.

Sri K. Malakondayya.—మద్రాసురాష్ట్రంలో మనము వున్నప్పుడు హేండులూము కోర్సులో చాలామంది ఆంధ్రులు వుత్తీర్ణులైనారు. చాలామందికి వుద్యోగాలులేకుండా వున్నారు. ఆంధ్రరాష్ట్రము వచ్చిన తరువాత ఈ పరీక్షలో హయ్యరుగ్రేడు, లోయరుగ్రేడులందు ఎంతమంది ప్యాసు అయినారు. ఎంతమందికి వుద్యోగాలు యిచ్చారో తెలియజేస్తారా?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—వేరే ప్రశ్న ఒకటి వేస్తే తప్పకుండా సెలవిస్తాను.

Sri A. Venkataramana Raju:—ఇప్పుడు కోటయ్యగారు చెప్పినప్రకారం కావలసిన పరికరాలు గుంటూరు, రాజమండ్రి కేంద్రాలలో వున్నవేమో సెలవిస్తారా?

[1st November 1954

The Hon. Sri S. B. P. Pattabhirama Rao.—ఇప్పుడు అక్కడ లోయరు గ్రేడులో పరీక్షలు జరుగుతున్నాయి. హయ్యరుగ్రేడులో మద్రాసులో జరుగుతున్నాయి.

Sri T. Nagi Reddi.—అయితే, ఆంధ్రదేశంలో ఇప్పుడు హైయర్ గ్రేడ్ పరీక్షలు పెట్టడానికి ప్రయత్నం చేస్తున్నారా? దానినిగురించి ప్రభుత్వము ఏమైనా ఆలోచిస్తున్నదా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—దానిని పరిశీలన చేయమని చెప్పాను. దానినిగురించి ప్రభుత్వము ఆలోచిస్తున్నది.

Sri. N. Sankara Reddi:—కావలసిన పరికరాలు ఎమ్మిగనూరు సెంటరులో ఏమైనా వున్నవా అని గవర్నమెంటు ఏమైనా పరీక్ష చేస్తుందా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—లేదని నేను చెప్పకుండానే వారే చెప్పారు.

Sri P. Narasimha Reddi:—పుల్లంపేటలో కావలసిన పరికరాలు లేవు అని చెబుతున్నారు. అయినా పుల్లంపేటలో విద్యార్థులకు కావలసిన పరికరాలు ఏమిటో తెలిపితే వారికి సహాయము పూర్తిగా ప్రజలచేత చేయించగలము. అప్పుడు అయినా ఉన్నత స్థాయిలో హయ్యరుగ్రేడు ట్రైనింగు సెంటరు పెట్టడానికి వాగ్దానము చేయగలరా ? అంటున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—వాగ్దానము చేయలేమండి. ఆ పరికరాలు వుంటేతప్ప అక్కడ సెంటరు పెట్టినందువల్ల అది పరీక్ష కాబోదు. కాని పరికరాలు తేవడానికి ప్రయత్నం చేస్తామని చెబుతున్నాను.

Sri T. Nagi Reddi:—పరికరాలు సహాయము చేస్తామని హామీ నిస్తున్నారు. ఆ సహాయంచేస్తే తప్పకుండా మీరు అక్కడ సెంటరు పెడతారా అని నరసింహారెడ్డిగారి ప్రశ్న.

1st November 1954]

The Hon. Sri S B P Pattabhirama Rao:—స్టాండర్డుకు తగినట్లు పండే తప్పకుండా చూడతాము.

INTRODUCTION OF LEGISLATION TO CONTROL THE FRUIT NURSERIES IN THE STATE

12 Q Sri P Narasimha Reddi:—Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state—

(a) Whether the Government propose to introduce Legislation to control the Fruit Nurseries in the State on the lines published in Fort Saint George Gazette, dated 22nd April 1953 under Part IV-A to check the sale of undesirable and untrue plants, and

(b) If not, why not?

The Hon. Sri P. Thimma Reddi.—

(a) No.

(b) The Government consider that before legislation is undertaken to control private Fruit Nurseries in the State, Departmental and other alternative sources for supply of Fruit plants should be fully developed

ఈ పండ్లతోటలకు అవసరమయ్యే నారు పెంచే నర్సరీలమీద కంట్రోలు చేయవలెనని 1953 లో గెజటు నోటిఫికేషను అయింది. కాని ఆ చట్టము చేయడానికి కొన్ని వస్తువులు కావాలి. గవర్నమెంటు నడిపే నర్సరీసులో కాని ప్రయివేటు వారు యింకెవరైనా నారుమళ్లుపోసే వాళ్ళ దగ్గరగాని డిమాండుకు సరిపోయేట్లుగా నారు సరఫరా అయ్యేట్టుగావుండే అప్పుడు ఆ చట్టము చేయడము వస్తీగా కనపడుతుంది. అందువల్ల వెంటనే ఆ చట్టము చేయడానికి వీలులేదు అని మనవిచేస్తున్నాను.

Sri P. Narasimha Reddi:—పండ్ల మొక్కలకు ఎంత డిమాండు వుండాలో అని చెప్పడము ఎప్పటికి సాధ్యముకాని పని. ప్రజలకు నిజమైన పండ్లమొక్కలు కాకుండా నాసిరకం పండ్లమొక్కలు అమ్మడము వల్ల చాలామంది మోసపోయారు. ఈ మోసాన్ని కనుక్కునేందుకు, కనీసము మామిడిచెట్లకు అయిదు సంవత్సరములు, చీని చెట్లకు 10 సంవ

త్వరాలు వస్తుంది. కాబట్టి ఇప్పటికైనా ఈ విషయము గమనించి పండ్లమొక్కలు అమ్మేవాళ్లు నాసిరకం మొక్కలు అమ్మకుండా తగిన చర్యలు తీసుకుంటారా ?

The Hon. Sri P. Thimma Reddi:—ఈ విషయంలో నరసింహారెడ్డిగారితో శాసనసభలో కాకపోయిన బయటనే ఇదివరకు చర్చలు జరిపినాను. కోడూరులో ప్రత్యేకంగా నారు సప్లయి చేస్తున్నారు. డిమాండుకు అక్కడ సప్లయిఅయ్యే నారు నూటికి యిరువది అయిదు వంతులు కూడా ఉండడం లేదు. బయట కొంతమంది తయారు చేస్తున్నారు. గిద్దలూరులోకూడా ఒక సెంటరు ఏర్పాటు చేశారు. అక్కడనుండి సప్లయి చేసేదానికి అవకాశము వుంటుంది. కాని చాలామటుకు నారింజకు సంబంధించి మంచినారు సప్లయి అవుతుంది. మామిడి తోటలకు సంబంధించి కూడా కొన్నిచోట్ల ఇది అమలు జరుగుతోంది. ప్రతి జిల్లాలోకూడా ఎగ్రికల్చరల్ ఆఫీసరుకుకూడా ప్రత్యేకంగా చెప్పబడింది. దానినిగురించి జాగ్రత్తచేయాలని ఆలోచిస్తున్నాము.

Sri G. Latchanna:—కంట్రోలుచేసే చట్టము పెట్టకపోయినా ప్రభుత్వము ఇప్పుడు కోడూరు నర్సరీనుంచి ప్రతి జిల్లాకు ఒక డిపో తెరచి మొక్కలు సప్లయిచేసేట్లు చూడాలి. ఇతరత్రా ప్రయివేటువారు సప్లయిచేసినట్లయితే కలిగే ప్రమాదాలను రైతులకు తెలియజేస్తూ ఉంటే కొంతవరకు నరసింహారెడ్డిగారి విధానము అమలు అవడానికి అవకాశం వుంటుందేమో పరిశీలిస్తారా అని అడుగుతున్నాను.

The Hon. Sri P. Thimma Reddi:—మనవిచేసిన మాటలు చెవిని పడలేదనుకుంటాను. కోడూరులో తయారయ్యే మొక్కలు వుండే డిమాండులో 25 వంతులకుకూడా చాలడములేదని చెప్పి మనవి చేసినాను. అప్పటికే అన్ని జిల్లాలనుంచి అగ్రికల్చరలు ఆఫీసర్లు మొక్కలు తెప్పించి సప్లయి చేస్తున్నారు. అగత్యము ఉన్నవారు కోడూరు పోయి తీసుకుంటున్నారు. అందువల్ల ఇతరచోట్ల ఏజన్సీలుపెట్టి అవి సప్లయి చేయడానికి కావలసిన సరకు లేదని మనవిచేస్తున్నాను.

Sri G. Latchanna.—చెవిని పడకపోవడము అనేదిఆలోచన పొరపాటేమో అని అనుకొంటున్నాను. అసలు చెప్పిన ప్రశ్న ఏమిటంటే వా

1st November 1954]

రిచ్చిన పాయింటు వేరు. ఈ పండ్ల పరిశ్రమ చాలా ప్రమాద స్థితిలోకి దిగజారుతోంది. కాబట్టి సరియైన మొక్క సప్లయిచేసే విధానము గురించి చట్టము చేయాలనే ప్రశ్న అది. చట్టము చేయాలన్నప్పుడు సరియైన మొక్కలు సప్లయి చేయడానికి ఆ మొక్కల అధిక వుత్పత్తి విధానము ఆలోచిస్తారనే ప్రశ్న చాలదని, వుత్పత్తి అధికముచేసి చట్టాలుపెట్టి ఆ సమస్యను పరిష్కరించగల అవకాశం వున్నదా, లేదా అని నా ప్రశ్న.

The Hon. Sri P. Thimma Reddi:—ప్రమాదము అనుకున్నంత పరిస్థితికి రాలేదు. ఈ మొక్కల సప్లయిలో అక్కడక్కడ చిన్న, చిన్న పొరపాట్లు జరుగుతున్నాయి. దానిని గురించి జాగ్రత్త చేయాలి.

Sri T. Nagi Reddi:—అంటే ప్రమాదకరమైన పరిస్థితి ఏర్పడే వరకు మంత్రిగారు ఇట్లాగే వుంటారన్నమాట.

The Hon. Sri P Thimma Reddi:—ఇది ప్రమాదముగానే వున్నది. ప్రమాదము తగ్గిపోయే పరిస్థితి అయింది. ఇది చిన్న, చిన్న పొరపాట్లుగా వచ్చింది. అవికూడా లేకుండా చేస్తున్నాము.

Sri P. Narasimha Reddi:—కనీసము కోడూరులో వుండే నర్సరీ ఫారము అయినా కొంతవరకు అభివృద్ధిచేస్తే 25 పాళ్లు కాకుండా 50 పాళ్లు, 60 పాళ్లు అయినా ప్రజలయొక్క అవసరాలకు సప్లయిచేసే అవకాశాలు కల్పించేదుకు దానిని యింకా expand చేస్తారా అండి?

The Hon. Sri P. Thimma Reddi:—ఎంత శ్రద్ధ చేస్తున్నామో అందరికి తెలియకపోయిన నరసింహారెడ్డిగారికి ప్రత్యేకంగా తెలుసు. కోడూరు ఫారము గురించి ఈ ప్రభుత్వం శ్రద్ధ చేస్తోంది. అయితే ఆయన కొంచెము తన తాలూకాలో వున్నది కాబట్టి యింకా గొప్పగా చెప్పారు. ఎంత గొప్పగా చేసేందుకు అవకాశాలున్నాయో అంతా చేస్తున్నాము కూడా.

Sri K. Veeranna Padal:— విశాఖపట్టణం ఏజన్సీలో 1946 వ సంవత్సరము ముందు విపరీతమైన కమలాఫలాలు వాగనుల కొలది సప్లయి

అవుతూఉండేవి. ఆ సప్లయి యిప్పుడు తగ్గిపోయింది. ఆ తోటలు యిప్పుడు ఏమైనాయి. ప్రభుత్వం దానివి గురించి ఏమైనా విచారిస్తుందా అండి ?

The Hon. Sri P. Thimma Reddi —మొత్తం ఏజన్సీ పండ్లు, ఫలాలు అక్కడ వచ్చే ఫలసాయాన్ని అంతటి కూడా క్రమమైన ధరలతో విక్రయముచేసే విషయం శ్రీ విశ్వనాథంగారు చూస్తున్నారు. కేంద్ర ప్రభుత్వముకూడా మనకు పెద్ద సహాయము చేసింది. దానినిగురించి జాగ్రత్త చేస్తున్నాము. ఈ పండ్లతోటలు ఎందుకు చచ్చిపోయినాయో. కావలెనంటే పరిశీలనలు చేసుకుందాము.

### COMMITTEE TO DEVISE WAYS AND MEANS OF LAND REVENUE ADMINISTRATION IN THE DISTRICTS

* 13. Q. Sri S. Vemaiah :—Will the Hon. the Minister for Land Revenue be pleased to state whether the Government appointed a committee to devise ways and means of Land Revenue administration in the Districts?

The Hon. Sri K. Koti Reddi·—The Government have not appointed a Committee to devise ways and means of Land Revenue Administration in the Districts.

Sri S. Vemaiah .—ఇప్పుడు ఉన్నటువంటి సిస్తు పద్ధతులు చాలా కాలముక్రిందట ఏర్పాటు చేయబడినవి. కాబట్టి ఎక్కువ రివెన్యూ వసూలు చేసుకోనేదానికి ఒక కమిటీని వెయ్యడానికి ప్రభుత్వం ఏమైనా ఆలోచిస్తుందా ?

The Hon. Sri K. Koti Reddi.—ఇప్పుడు ఉన్న పద్ధతులు సక్రమంగానే ఉన్నవి. మీరందరు సహాయంచేస్తే ప్రభుత్వం ఎంతైనా చెయ్యగలదు.

Sri B. Sankarayya:—ఈ రివెన్యూ పద్ధతులకు సంబంధించి అనేక దఫాలు మార్పులు చేస్తామని శాసనసభకు వాగ్దానాలు ప్రభుత్వం చేసియున్నది. కాని ప్రయోజనము లేకపోయింది. కాబట్టి ఇందు విషయమై ఒక కమిటీని వెయ్యడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ? బంజర్ల పంపకం జి. ఓ. వచ్చిన తరువాత ప్రతి కరణం రు1000/దాకా లంచాలు తీసుకుంటున్నారు.

1st November 1954]

The Hon. Sri K Koti Reddi —కావలసినంతమంది ఆఫీసర్లు, సిబ్బంది ఉన్నది. ఇంకా ఏమైనా చెయ్యవలసివుంటే ప్రభుత్వం చేస్తుంది.

Sri Vavilala Gopalakrishniah.—ల్యాండు రివెన్యూఅక్కౌంట్సు పద్ధతులలో మార్పులు చేయవలెనని అనేకమైన రిపోర్టులు వ్రాస్తూ వచ్చేరు. దీనిని పురస్కరించుకొని మద్రాసు ప్రభుత్వంవారు ఒక కమిటీని వేసినారు. మనము వారుకూడా అన్నదమ్ములలాగ ఉన్నాము. మన సమస్యలు వారి సమస్యలు ఒకటేగదా! మనకుకూడా అదే అవసరం ఉన్నది. కాబట్టి ఒక కమిటీని ఏర్పాటు చేస్తారా ?

The Hon. Sri K. Koti Reddi:—కమిటీ అవసరంలేదనే నా అభిప్రాయం, అయినా ఆలోచన చేస్తాము.

Sri C. V. K. Rao·—అధ్యక్షా ! బోర్డు ఆఫ్ రివెన్యూ ప్రస్తుత పరిస్థితులకు అనుగుణముగా లేదు అనే అభిప్రాయమున్నది. అందుచేత ఆంధ్రకు రివెన్యూబోర్డును రద్దుచెయ్యడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

The Hon. Sri K. Koti Reddi.—చాలాకాలమునుండి ఈ విషయం ఆలోచనలో ఉంది. ఇప్పుడుకూడా ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

Sri P. Kotaiah:—అధ్యక్షా! ఈ రివెన్యూ డిపార్టుమెంటుకు కాగితము పంపిస్తే మాసములుకాదు, సంవత్సరాల తరబడి రావడం లేదు. ఉదాహరణలు చెప్పాలంటే ఎన్నైనా ఉన్నవి. ఈ పద్ధతిలో ఏమైనా మార్పుచేస్తే త్వర త్వరగా కాగితాలు రావచ్చును. ఇందుకు ప్రభుత్వం పూనుకుంటుందా ?

The Hon. Sri K. Koti Reddi:—సాధ్యమైనంతవరకు త్వరగా వచ్చేటట్లు చూస్తున్నాము.

Sri T. Nagi Reddi:—దీనికిమాత్రం అంగీకరించడం ఎందుకు.

The Hon. Sri K. Koti Reddi:—అన్ని విషయాల గురించి ఆలోచిస్తాము.

Sri G. Yellamanda Reddi:—అధ్యక్షా! కమిటీ అవసరం లేదని చెప్పేరు. అంటే ఆడ్మినిస్ట్రేషను చక్కగా జరుగుతుందనా?

The Hon. Sri K. Koti Reddi —చక్కగా జరుగుతుందనే అభిప్రాయం. అయినా ఆలోచన చేస్తాము.

### RYOTS' MARCH TO KURNOOL

* 14. Q. Sri G. Yellamanda Reddi:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) Whether there were instructions to the local police stations to note down the names of those who participated in Ryots' march to Kurnool; and

(b) if so, the reasons for the same?

The Hon. Sri N. Sanjeeva Reddi.—

(a) No, Sir.

(b) Does not arise.

Sri G. Yellamanda Reddi:—అధ్యక్షా! ఈ రైతుయాత్ర సందర్భములో అనేక పోలీసు స్టేషనులలో పేర్లు వ్రాసుకున్నారు. అట్లా వ్రాసుకోనకపోతే ముందుగా ప్రతి పోలీసుస్టేషనులో పోలీసు బందోబస్తు D. S. P. లు Dy. S. P. లు ఎందుకున్నారో తెలవిస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi:—D. S. P. లకు Dy. S. P. లకు ఇతర పనులు ఇతర కార్యక్రమాలు ఉన్నవి. అందుకోసము వారు అక్కడ ఉన్నారు.

Sri K. Subba Reddi:—గ్రామ గ్రామానా పోలీసులు ప్రవేశించి పేర్లు వ్రాసుకొని కేసులుపెట్టిన విషయం స్పష్టంకాదా. ఇది ప్రభుత్వానికి తెలుసునా?

The Hon. Sri N. Sanjeeva Reddi:—పట్టాలు పీకడం, అగ్గి పెట్టడం జరిగిన తరువాత పేర్లు వ్రాసుకొని ఉంటారేమో. ఇంతేగాని మొదటిలో పేర్లు వ్రాసుకోవలసిన అవసరం కలగలేదు.

1st Novembei 1954]

Sri S Kasi Reddi —అధ్యక్షా! ఇప్పుడు రైతు కూలీయాత్రా సందర్భములో రైలుపట్టాలు పీకినవారిని తీగలు తెంపినవారిని అరెస్టు చెయ్యమని ఆర్డర్ల ననుసరించి ఆ సందర్భములో సరిగా విచారణ జరుప కుండా పోలీసులు ఇష్టమువచ్చినవారిని, పెత్తందారులు పేర్లు ఇచ్చినవారిని చాకిరేవునుంచి వచ్చేవారిని, గొల్లవారిని కార్యానికి సిద్ధంగావున్న పెళ్లి కొడుకులను, కార్యానికి వెళ్లుతున్నవారిని, కరణాలను, టీచర్లను, పిల్లలను మునసబులను అన్యాయంగా అరెస్టుచెయ్యడం జరిగింది. ఈ విషయం ప్రభుత్వానికి తెలిపాము. ఈ విషయమై ప్రభుత్వం చర్యతీసుకుంటుందా. ఇంతవరకు ప్రభుత్వం ఈ విషయం గుర్తించి విచారణ జరిపిందా?

The Hon. Sri N. Sanjeeva Reddi —కార్యానికి పోతూవున్న వారిని కాశిరెడ్డిగారు ఈ ఉద్యమానికి పంపేరుఅన్నమాట. దుర్మార్గముగా ప్రవర్తించినవారిని, అగ్గిపెట్టినవారినిమాత్రమే అరెస్టు చేసినారు.

Sri S. Kasi Reddi —మామూలుగా రాష్ట్రంలో లా అండు ఆర్డరు మెయింటైను చెయ్యడానికి పోలీసువారికి ఏమైనా అధికారాలు ఉన్నవా లేక మంత్రిగారు ఆర్డర్లు ఇస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi.—ఉత్తర్వులు ప్రతిదానికి అవసరంలేదు. బాధ్యత వారిదే. వారే చర్యతీసుకుంటారు.

Sri G. Yellamanda Reddi:—అధ్యక్షా! కాశిరెడ్డిగారు అన్యాయంగా అరెస్టుచేసిన విషయము చాలా చెప్పారు. కాని మంత్రిగారు లేదంటున్నారు. చాలామందిమీద పెట్టిన కేసులు కోర్టువారు కొట్టివేశారు. అందువల్ల పోలీసులుపెట్టిన కేసులు అన్యాయమని రుజువు అగుచున్నది కదా? ఆ విధముగా అనవసరముగా కేసులు పెట్టినవారిమీద యాక్షను తీసుకుంటారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi:—కూనీకేసులు ఎన్నో విడుదల చేస్తున్నారంటే కూనీలు జరగలేదనా? దొంగసాక్ష్యము చెప్పుకొని కొంతమంది తప్పించుకుంటారు. అందువల్ల కేసులు అబద్ధం అని చెప్ప డానికి వీలులేదు.

[1st November 1954

Sri B. Sankarayya —ఈ రైతుయాత్ర బయలుదేరే ముందు నుంచే గ్రామాలలో బెదరించడం వ్యతిరేకులుయిచ్చే పేర్లు వ్రాసుకొనడం, వారిమీద కేసులుపెట్టడం ప్రభుత్వదృష్టికి తీసికొనివచ్చాము. ఈ విషయాలన్నీ ముందైనా సరిఅయిన విచారణ చేయిస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi —విచారణ జరపడానికి పొరబాట్లు జరిగినవని అంగీకరించితేకదా? అంతా సవ్యముగానే జరిగింది.

Sri T. Nagi Reddi :—సంజీవరెడ్డిగారు కడపట సత్యమే చెప్పేరు. ప్రభుత్వం అంగీకరించితేకదూ అన్నారు. అయితే ఒక చార్జి చేసినాము. కార్యానికి పోతున్నవారినికూడా అరెస్టు చేసినారు. పెళ్లికివచ్చేమని చెప్పిన వారిని తీసుకుపోయినారు. ప్రభుత్వంవారు తమ పొరబాటు ఉన్నదేమో తెలుసుకుని ఈనాడైనా అవసరమైన చర్య తీసుకొనడానికి సంజీవరెడ్డిగారు ప్రయత్నం చేస్తారా? లేకపోతే పెళ్లిళ్లు చేసుకొనడమే కష్టమవుతుంది.

The Hon. Sri N. Sanjeeva Reddi.—ఇప్పుడు చెప్పినది నిజమని మేము అంగీకరించడములేదు. మాకు ఆ విధముగా తోచడములేదు.

REPORT OF SECONDARY EDUCATION COMMISSION

* 15. Q. Sri Vavilala Gopalakrishnaiah :—Will the Hon. the Minister for Education and Industries be pleased to state—

(a) whether the Government are considering the report of Secondary Education Commission; and

(b) if so, the recommendations of the Commission which the Government propose to implement?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao.—

(a) The answer is in the affirmative;

(b) The matter is under consideration of the Government.

Sri Vavilala Gopalakrishniah:—సెకండరీ ఎడ్యుకేషను కమిషను రికమండేషనులలో మల్టీపర్పసు హైస్కూల్సు పెట్టాలని చెప్పారు. దాని విషయములో యేమి ఆలోచిస్తున్నారు? పెట్టాలనే అభిప్రాయం ఉంటే వివరములు చెబుతారా?

1st November 1954]

The Hon. Sri S. B. P. Pattabhirama Rao— మల్టీ పర్పసు హైస్కూళ్ళు ఒక్కటేకాదు. రికమండేషన్సు ఇంకా చాలా ఉన్నవి. మొత్తంమీద ఆలోచనచేసిగాని ఏమీా చెయ్యడం కష్టం. ఇందుకోసము రేపు నవంబరు రెండు మూడు తారీకులలో ఢిల్లీలో ఎడ్యుకేషను సెక్రటరీలు, డైరక్టర్స్ ఆఫ్ పబ్లికు ఇన్‌స్ట్రక్షను సమావేశం అవుతున్నారు. మీటింగు పర్యవసానము తెలిసిన తరువాత ఏదో ఒకటి చెప్పడానికి సాధ్యము అగుతుంది.

Sri Vavilala Gopalakrishnaiah —మల్టీ పర్పసు హైస్కూలు పెట్టాలంటే ముందు జరగవలసిన పని చాలా ఉన్నది. అకడమిక్ సంవత్సరం ముందు ఆర్డర్లు రాకపోతే సమయములో రాలేదని స్కూల్సు ఎగిరిపోవడం జరుగుతుంది. అందువల్ల ఇప్పుడే ఏఏ స్కూళ్లు పెట్టడమో ఆలోచిస్తే బాగా ఉంటుంది. ఈ పని చెయ్యడానికి వెంటనే ప్రయత్నం చేస్తారా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—నేను ఇదివరకే మనవిచేసేను. నవంబరు 2, 3 తారీఖులలో ఢిల్లీలో మీటింగులు అగుతవని. పర్యవసానము తెలిసిన తరువాత యోచన చేస్తానని తిరిగి మనవి చేస్తున్నాను.

Sri T. Nagi Reddi.—ఢిల్లీ మీటింగు చర్చల పర్యవసానము తెలిసిన తరువాత తమరు ఆలోచిస్తాము అంటున్నారు. కుప్పుస్వామి కమిటీ రిపోర్టుకూడా తమరు ఆలోచిస్తారా అని అడుగుతున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—కుప్పుస్వామి కమిటీ రిపోర్టుకూడా ఆలోచిస్తామని మనవి చేస్తున్నాను.

Sri P. Venkatasubbaiah :—సెకండరీ ఎడ్యుకేషను కమిటీ రిపోర్టు చాలా ముఖ్యమైనది కనుక శాసన సభ్యులకు అందరకు అంద చేస్తారా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—సెకండరీ ఎడ్యుకేషను కమిటీ ఒక్క మన స్టేటుకు మాత్రమే సంబంధించినదికాదు. ఇండియా అన్ని స్టేటులకు సంబంధించినది. ఆ రిపోర్టులు వచ్చిన తరువాత ఆలోచిస్తాము.

[1st November 1954

Sri S. Vemaiah.—సెకండరీ ఎడ్యుకేషను కమిటీ రికమండేషనులు ముఖ్యమైనవి చదువుతారా ?

The Hon Sri S. B. P. Pattabhirama Rao:—ఇది చాలా పెద్ద ప్రశ్న.

Sri Pragada Kotaiah·—నేటి చదువులవల్ల నిరుద్యోగం హెచ్చు అవుతోందికదా; Secondary education గురించి ఆలోచిస్తున్నాం అంటున్నారు కాబట్టి ఆ సందర్భంలో నిరుద్యోగ నివారణకు తోడ్పడునట్లుగా విద్యావిధానంలో మార్పు తీసుకురావడానికి ఏమైనా ఆలోచిస్తారా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—నిరుద్యోగం చదువుకున్నవారిలోమాత్రమే కాకుండా చదువుకోనివారిలోకూడా వున్నది. ఈ ప్రశ్నకు సెకండరీ విద్యా విధానానికి సంబంధంలేదని మనవిచేస్తున్నాను.

Sri Vavilala Gopalakrishniah.—ఆ రిపోర్టులో మూడు సంవత్సరాల కాలేజీ కోర్సులు పెట్టాలి అని వున్నది. దాన్ని అమలు చేస్తారా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:—ఆంధ్ర విశ్వ విద్యాలయంవారుకాని మరొక విశ్వవిద్యాలయంవారుకాని ఆ విషయంలో ఏమీ చెప్పలేదు.

## EXPUNGING OF CERTAIN REMARKS

Sri Garapati Satyanarayana :—Point of order, Sir, ఆఖరు ప్రశ్నకు ముందు ప్రశ్నలో శ్రీ ప్రగడ కోటయ్యగారు వేసిన సప్లిమెంటరీ ప్రశ్నలోని కొన్ని మాటలు శాసనసభా మర్యాదకు భంగకరంగాను, అసభ్యంగాను వున్నవి.

Mr. Speaker:—ఆ మాటలు రిపోర్టులో ఉండవు.

## II. CONDOLENCE MOTION RE DEATH OF SRI RAFI AHMED KIDWAI

Mr. Speaker:—I have to announce to the House with feelings of profound sorrow the death of Sri Rafi Ahmed Kidwai, Union Minister for Food. Presently the Deputy Chief Minister will move a motion on that.

